# శ్రీ కనకదుర్గ శతకము



రచన

**దేవరపు రాఘవులు**

భద్రగిరిరామ శతకకర్త

# శ్రీ కనకదుర్గ శతకము

ACC NO. 14051



రచన

శ్రీ దేవవరపు రాఘవులు

భద్రగిరిరామ శతకకర్త

శ్రీరామ జయరామ జయజయరామ।

ఓం శ్రీ శారదాంబనే నమః

ఓం శ్రీ శిద్ధిగణపతినే నమః

# * పరిచయము

సారస్వతాభిమానులైన సహృదయులకు; దైవపథ గాములైన మహా భక్తులకు; ప్రగతిశీలక వాదులకు; పావన స్వాంతులకు ప్రజాభ్యుదయ ప్రబోధకులకు సకల సత్కవిజన బుధజన బృందములకు నా వందనములు.
మహాశయులారా!

తెలుగు భాషలో సుమారు 300 శతకములు పైగా వున్నట్లు తెలియుచున్నది. దీనినిబట్టి మన తెలుగువారికి గల విశేష భాషాభిమానము; భాషా సంబంధమైన సదవగాహన; భాషా సామరస్యము; సాహిత్య పోషణ జగద్విదితమైన విషయమే గదా!

ప్రస్తుతము మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు తెలుగు భాషా వికాసమునకు; అభివృద్ధికి అద్వితీయ నిర్విరామ కృషి గావించుట సాహిత్యాభిమానులైన మాబోటి వారికి కడుంగడు సంతసమును కలిగించు చున్నది.

నాకు చిన్నతనము నుండియు మంచి ఆసక్తి గలిగించిన శతకములు నరసింహ శతకము; దాశరథీ శతకము, శ్రీకాళ

హస్తీశ్వర శతకములై యున్నందున యీ సందర్భమందు నాయా శతక కర్తలైన శ్రీమాన్ ధర్మపురి శేషప్ప; శ్రీమాన్ కంచెర్ల గోపన్న; శ్రీమాన్ ధూర్జటి కవి సత్తములకు పాదాభివందనములు గావించుచున్నాను.

సంప్రదాయ సాహిత్యము ద్వారా దైవభక్తిని; దేశభక్తిని; ప్రగతిశీలక విధానమును; సంఘ సౌభాగ్యమును సామాన్య జనానీకము మొదలు జనాధిపతులవరకు ప్రచారము గావించవచ్చును. భారతదేశ సాహిత్య రంగములో విఖ్యాతిగాంచిన బెంగాలీ; మరాఠీ భాషల కంటెను కడుం గడు ప్రఖ్యాతి వహించి విశేష సంస్కృతిని నిలబెట్టుకొన్న మహత్తరమైన మృదుమధుర భాష; మోహనాకారము కల్గిన యోష మన తెలుగు భాషయని చెప్పుకొనుటకు తెలుగు వారమైన మన మందరమూ గర్వించవలసి యున్నది.

ఇట్టి తెలుగు భాషలో పూర్వమునుండీ యున్నా ఛందోబద్ధమైన కవితారచన గావించుట మనకు సత్ సాంప్రదాయమై వచ్చుచున్నది.

ఎట్టి కవులైనను, ఆయా భాషలందు గల శబ్ద సౌకుమార్యమును; సొగసును, శైలిని సంపూర్తిగా విస్మరింప జాలరు! కనుక కవితా రచనయందు సాంప్రదాయమునకు కట్టువడి ఛందోబద్ధమైన రచనకు పూనుకొని యుంటిని.

"దైవభక్తి; దేశభక్తి; సంఘ సౌభాగ్యము; ప్రగతి శీలక విధానము" అనే నాలుగు ప్రధాన సూత్రముల నా

దర్శప్రాయముగా నెంచుకొని కవితా రచన గావించుట జరుగుతున్నది.

సంపూర్ణమైన దేశభక్తిని గూర్చి "వందేమాతరం" అనే కావ్యమును రచించుట జరిగినది. దేశభక్తి; దైవభక్తి; సంఘ సౌభాగ్యము; ప్రగతిశీలక విధానములనుగూర్చి ఒకే ఒక్క పుస్తకము "కోకిల సందేశము"లో కూర్చుట జరిగినది.

"ఆత్మ-పరమాత్మ" అనే వచన గ్రంథమును శాస్త్రీయ విజ్ఞానమును పురస్కరించుకొని వ్రాయబడినది. మత సామరస్యమును పాటించుట మానవీయతకు ప్రాణంబని భావించి "శ్రీ క్రీస్తు పురాణమును" రచించుట జరిగినది. దైవభక్తి విషయములో చక్కని భావ ప్రేరణ గలిగించే మహత్తర కావ్యమైన శ్రీ రవీంద్ర గీతాంజలి నాధారము చేసుకొని "రవీంద్ర గీతాంజలి - రమణీయ హృదయాంజలి" అనే పేరుపెట్టి ఒక పద్యకావ్యాన్ని (సంపూర్తి తేట గీతులతో) వ్రాయుట జరుగుచున్నది.

1975 మే నెలలో భద్రాచలము నుండి విజయవాడ కొక పని నిమిత్తమై వెళ్ళియుంటిని. శ్రీకనకదుర్గాంబను; శ్రీమల్లేశ్వరుని దర్శించుకొని, అమ్మవారి కీర్తినిగూర్చి ఒక శతకము వ్రాయవలెనని సత్సంకల్పము గావించుకొని; అమ్మహత్తర "యింద్ర కీలాద్రి" పైనుపవిష్టుడనై, తెలుగు నేలకు వరప్రసాదినియైన నిర్మల కృష్ణానదీ శోభనుగాంచి పులకించి; విజయవాడ నగరవైభవమును కనులార వీక్షించి

యానందించి; శ్రీదుర్గా మల్లేశ్వర క్షేత్ర మాహాత్మ్యమును పఠించి పరవశించి

"విశ్వవిఖ్యాత పూత! శ్రీ విజయవాడ
ఘనవినుత చరిత! జనని కనకదుర్గ!" అనే మకుటమును నిర్ణయించుకొని కొన్ని పద్యములకు శ్రీకారము చుట్టుట సంభవించినది. తదుపరి; ది 10-10-75న చక్కని ఉత్సవములు జరిపి శాస్త్రోక్తమైన పూజలను గావించి దిగువ సీలేరు ప్రాజెక్టు ఉద్యోగులు కంట్రాక్టర్ల బృందము కలిసి కమనీయమైన మందిరములో అష్టభుజ ధారిణియైన శ్రీకనకదుర్గను పొల్లూరులో ప్రతిష్ఠించినారు.

"ప్రపంచములో దుర్గాలయ మెక్కడున్నను శ్రీవిజయవాడ కనకదుర్గకు ప్రతిరూపమే కదా!" అనుకొని మకుటమును పొల్లూరు పేరుతో మార్పు చేయుట జరిగినది. ఈశతకమును 1976 సంక్రాంతికి విడుదల చేయాలని నామిత్రుడు; ఉత్తమ దైవభక్తుడయిన శ్రీ వి. కోటేశ్వరరావుగారెంతో ప్రయత్నించిరి; కాని కొన్ని యాటంకముల వలన సఫలముగా లేదు.

"అమ్మ వారి శతక ముద్రణ కీయాటంకము లెందుకు వచ్చెనా"యని చింతించి; శ్రీవిజయవాడ కనకదుర్గాంబను మనసులో స్మరించుకొని నిద్రించితిని. ఆరోజురాత్రి కలలో "భవ్య గుణజాల! శివలోల! భక్తపాల ఘనవినుత! శ్రీవిజయవాడ కనకదుర్గ"అనే మకుటము నాకెవరో వినిపించినట్లు నామదికి తోచినది. అప్పుడాకారము మకుటమును వ్రాసికొంటిని!అమరునటి రోజునే డాక్టరు శ్రీనివాసులు రెడ్డిగారు నన్ను

పిలిపించి వారి వ్యవస్థనుండి ఆరువందల రూపాయల నొసంగి యీ శతక ముద్రణకు కారణ భూతులయిరి. శ్రీ శ్రీనివాసులు రెడ్డిగారి ప్రతిపాదనవిని శ్రీ ఎ. రామిరెడ్డి యింజనీరు గారు పూర్ణాంగీకారమును చూపించిరి. ఇవ్విషయమునందు శ్రీ శ్రీనివాసులురెడ్డిగారికి శ్రీ రామిరెడ్డి యింజనీరుగారికి నా హృదయపూర్వక వందనము లందజేయుచున్నాను

సాహిత్య సంస్థలకుగాని; ప్రగతిశీలక వ్యవస్థలకుగాని; సాహిత్యాభిమానులకుగాని; ప్రజాభ్యుదయ వాదులకు గాని; దేవాలయ సంస్థలకు గాని వలసినచో నారచనల నుచితముగా యెటువంటి ప్రతిపాదన లేకుండగ సమర్పించ బడునను తెలియజేయుచున్నాను.

ఈ పుస్తక ముద్రణకు వలసిన ద్రవ్యసహాయ మొనరించిన దాతలు;

శ్రీ కె. పట్టాభి రామరెడ్డి B.Sc; B.E యింజనీర్సు అండ్ కంట్రాక్టరు; సంగం పోస్టు; నెల్లూరుజిల్లా
వారికిన్నీ

శ్రీ యన్. చంద్రశేఖరరావు కంట్రాక్టరు;
డొంకరాయి వారికిన్నీ

శ్రీ సి. హెచ్. గోవరనరావు B.E.(A.E of A.P S.E B.)
వారికిన్నీ

శ్రీ వి. కోటేశ్వరరావు B.E (J.E. of P.W.D.)
వారికిన్నీ

శ్రీ పి. రామమోహనరావు B.E.(J.E. of A.P.S.E.B.)
వారికిన్నీ

పిలిపించి వారి వ్యవస్థనుండి ఆరువందల రూపాయల నొసంగి యీ శతక ముద్రణకు కారణ భూతులయిరి. శ్రీ శ్రీనివాసులు రెడ్డిగారి ప్రతిపాదనవిని శ్రీ ఎ. రామిరెడ్డి యింజనీరు గారు పూర్ణాంగీకారమును చూపించిరి. ఇవ్విషయమునందు శ్రీ శ్రీనివాసులురెడ్డిగారికి శ్రీరామిరెడ్డి యింజనీరుగారికి నా హృదయపూర్వక వందనము లందజేయుచున్నాను

సాహిత్య సంస్థలకుగాని; ప్రగతిశీలక వ్యవస్థలకుగాని; సాహిత్యాభిమానులకుగాని; ప్రజాభ్యుదయ వాదులకు గాని; దేవాలయ సంస్థలకు గాని వలసినచో నారచనల నుచితముగా యెటువంటి ప్రతిపాదన లేకుండగ సమర్పించ బడునను తెలియజేయుచున్నాను.

ఈ పుస్తక ముద్రణకు వలసిన ద్రవ్యసహాయ మొనరించిన దాతలు;

శ్రీ కె. పట్టాభి రామరెడ్డి B.Sc; B.E యింజనీర్సు అండ్ కంట్రాక్టరు; సంగం పోస్టు; నెల్లూరుజిల్లా
వారికిన్నీ

శ్రీ యన్. చంద్రశేఖరరావు కంట్రాక్టరు;
డొంకరాయి వారికిన్నీ

శ్రీ సి. హెచ్. గోవరనరావుB.E.(A.E of A.P S.E B.)
వారికిన్నీ

శ్రీ వి. కోటేశ్వరరావు B.E (J.E. of P.W.D.)
వారికిన్నీ

శ్రీ పి. రామమోహనరావుB.E.(J.E. of A.P.S.E.B.)
వారికిన్నీ

శ్రీరస్తు　　　　శుభమస్తు　　　　అవిఘ్నమస్తు

# శ్రీ కనకదుర్గ శతకము

సీ॥ శ్రీయుతమూర్తివి; సృష్టికి మూల శ
　　క్తివి; దుష్టరాక్షస తిమిరమెల్ల
ఖండించి జగముల కాపాడినట్టి ద
　　యారాశివి; భరతవీరులందు
శౌర్యము; ధైర్యము స్థాపించి నిలచిన
　　పావననేతవు, భారతీయ
జీవితమ్ములుదిద్దు చిద్విలాస నిధివి,
　　కరుణతో మమ్మేల కలియుగమున

తే॥గీ॥ జీవనదులుగలిగి విలసిల్లుచున్న
తెలుగు భూమియందు వెలసి నిలచినావు,
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ!

సీ॥ విద్యుత్తుశాఖలో నుద్యోగినై జీవి
తంబును గడుపుచు; దైవతత్త్వ
జిజ్ఞాసతో సవ్య చిన్మయానందము
పొందకోరుచు మహా పుణ్యమలర
సర్వమానవులకు సౌశీల్యభావముల్
బోధింప నిశ్చల బుద్ధికలిగి
మతతత్త్వరహితమౌ మానవతను కోరి
"కనకదుర్గ శతకము"ను రచించి

గీ॥ నీకు కృతి యిచ్చుచుంటిని నిర్మలముగ!
వేగ నను బ్రోవుము భవాని! విశ్వజనని!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 2

సీ॥ విఘ్నేశు; భారతీ విమలమూర్తుల కెల్ల
మ్రొక్కుచుంటిని చాల ముదముతోడ;
వాల్మీకి వ్యాసాది పావన మునులకు
దండాలుగావింతు ధన్యమలర!
అనఘులౌ కాళిదాసాది సుకవులకు
నంజలి ఘటియింతు నాదరముగ!
పోతన్న త్యాగయ్య పుణ్యభక్తులకును
వందనములు సల్పి వైభవముగ!

గీ॥ మాటిమాటికి రాముని మదిని దలచి
యీ శతకమును వ్రాసితి నీశ్వరాంబ!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 3

సీ॥ దివ్యమైనట్టి నీ దీక్షను దర్శించి
ముక్కంటి హృదియందు ముదముచెందె;
భవ్యమైనట్టి నీ భాగ్యమున్ వీక్షించి
త్రిపురారి తనలోన తృప్తినందె;
సవ్యమైనట్టి నీ సౌందర్యమును గాంచి
హరునకు మదిలోన మరులుకలిగె;
నవ్యమైనట్టి నీ నడవడిన్ ప్రేమించి
ఫాలనేత్రుఁడు పొందె పరవశంబు!

గీ॥ అవ్యయంబమ్మ నీశక్తి యాదిమాత!
కావ్యపోషకి వీవమ్మ కన్నతల్లి!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 4

సీ॥ మున్నెప్పుడోవచ్చె ముప్పుతో కలవులు
విశ్వమంతట క్రమ్మి విపులగతిని;
మునులెల్ల కవులెల్ల ఘనులెల్ల బుధులెల్ల
గళమెత్తి కన్నీరు కార్చి కార్చి

"జీవకోట్లను బ్రోచుదేవివి" నీవమ్మ
దయను జూపింపవే తక్షణంబు
కాకున్న జగమెల్ల కాఱుచీకటి కాదె
సృష్టిసర్వము నశించుగాదె

గీ॥ అనుచు నిన్నెంతయో కొనియాడినపుడు
నీవు ప్రార్థనవిని కరుణించినావు
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 5

సీ॥ ఎక్కడ జూచిన నక్కడ బచ్చలి,
పొనగంటి; గోంగూర పొలుపుగాను
తోటకూర; కొజాన; వాటముగను పాల
కూర; మఱియు మెంతికూర; కొత్తి
మీరియున్ మఱి చుక్కకూరయు; గంగవా
యిలకూర, ముల్లంగి యింపుగాను
బీర వంగ సొరయు బెండ దొండయు; పొట్ల
కంద పెండలము కాకరయునెల్ల

గీ॥ శాకములుపుట్టె మాత నీ చలువ వలన
ధరణి నిలబడెగద నిన్ను తలచుకొనుచు
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 6

సీ॥ వాదములేటికి నీ దయాదృష్టిచే
దేవతాబృందాల దీక్షపండె;
తర్కములేలను? తల్లి నీ కరుణచే
లోకులు జీవించు లోటులేక;
సందేహమేలకో? సుందరేశుడు నీకు
దాసోహమనెనమ్మ వాసిగాను;
యిలను నీ విఖ్యాతి కీడుకల్గినవారు
వేరొక్కరైనను లెక్కకైన;

గీ॥ ఇట్టి మాతను మఱచిన యిహపరములు
కలుగవనుచు వచించె సత్కవులు భువిని!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 7

సీ॥ దక్షప్రజాపతి తండ్రిడి నీకైయుండి
“నినుపిలువక తలచె; నతి హేయ
మైనరీతిగ నల్పయజ్ఞము” నదివిని
కారుణ్యమూర్తి గంగాధరుండు
మేల్మిదైవము చాలతాల్మి వహించిన
నీవు వెడలినావు నిర్మలముగ,
తల్లిదండ్రులు నిన్ను దయతోడజూడక
తిట్టుకొనిరిగద పట్టిపట్టి

గీ॥ అంత నీ బాధ వర్ణింప నలవియగునె!
నీదులీలలు తెలియంగ నేర్వగలనె!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 8

సీ॥ దయలేని భవదీయ తల్లిదండ్రుల కంత
కనువిప్పు కలిగింప; కరుణయొప్ప
యుజ్జ్వలంబైనట్టి యోగాగ్నిలో నీవు
దేహమున్ విడనాడ; దివ్యతముడు
ముక్కంటి గాండ్రింప; దిక్కులు ఘీపెట్ట
వీరభద్రుడుపుట్టె ధీరుడగుచు
లోకనాయకులంత శోకముడుచుకొని
పారిపోయిరి తాము భయముచెంది

గీ। ఆడబిడ్డలు నిజమైన యాప్తులనుచు
జగము గ్రహియించె నాటితో చారువదన!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 9

సీ। మహిమ లలరనీవు మరుజన్మమందున
పార్వతీదేవివై ప్రబలియుండ;
తారకుండనునట్టి దైత్య చండాలుండు
బ్రహ్మవరములచే బలముపొంది

దనుజులగుమిగూడి దండయాత్రలుసల్పి
పదునాల్గు జగతులన్ పాడుచేయ;
దేవతానీకంబు పావనచిత్తులై
నిన్ను ప్రార్థించగ! నీవు దయను

గీ॥ షణ్ముఖునిపిల్చి రిపులను చంపివేసి
రమ్మటంచు పంపితివి విరాజమొప్ప!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 10

సీ॥ మహిషాసురుండను మాన్యబలుడొకండు
లోకులనెల్ల చీకాకుపఱచ
యింద్రాదిదేవత లిడుమలు బడలేక
సన్నుతించిరి నిన్ను శాంతికోఱకు;
జగదేకమాతవై శత్రుని దీనగ
తిని గాంచి కరుణించి చెనటియైన
రాక్షసనాథుని ప్రాణముల్ దునుమాడి
జనులందఱికి దిగ్విజయమొసంగి

గీ॥ ప్రాణములనిల్పి దయను కాపాడినావు!
అట్టితల్లివి! నీకు నా యంజలిదియె!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 11

సీ॥ మహిషుడానాడు తా మట్టిలో గలిసెను
నీదుకోపాగ్నిచే నిక్కముగను;
వడ్డీలపై పెచ్చువడ్డీలను వసూలు
చేసికొనెడు "మహిషాసురు"లిపు
డు వెలసిరిగద తండోపతండంబులై
వీరిని శిక్షించువారలేరి?
తారకున్ చంపించి ధరను బ్రోచితివి హో
కానినే డరయగ కలరు "త్రాగు

గీ॥ బోతులైన తారకులు" సంప్రీతితోడ
తల్లి వీరిని మార్చవే తక్షణంబు
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 12

సీ॥ రావణుండానాడు రామభద్రునిచేత
సంహారింపబడెను శాశ్వతముగ;
కాని నేడు తలచ కలరు రావణజాతి
లక్షకులక్షలై యక్షయముగ;
వీరిని పరిమార్చు భారంబు నీదని
ప్రార్థించుచుంటిమి పదిలగతిని
"కామమున్ క్రోధమున్ నీమము కాదని
పాడు రావణజాతి పలుకదాయె!

గీ॥ నాస్తికనుతము మముజూచి నవ్వుచుండ
సైపజాలవలదు! తల్లి! శాంతగతిని!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 13

సీ॥ సింహబలుడు తాను సిగ్గులజ్జలువీడి
పావన ద్రౌపదిన్ పట్టదలచ
భీమసేనుడుచూచి ధీమముతో పోరి
సింహబలునిబట్టి చిచ్చుపెట్టె!
కామ మదోన్మత్త కఠినచిత్తుల పర
కీచకుల్ వెలసె పిశాచములన
అమ్మ! వసుధయందు నాడబిడ్డలకెల్ల
రక్షవై తివినీవు రమ్యమొప్ప!

గీ॥ అపరకీచకులనుబట్టి వాడలగొట్టి
ధర్మమును నిలబెట్టవే దక్షతనయ!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 14

సీ॥ నిన్ను పూజించి యాపన్ననాథుండగు
శ్రీ రామచంద్రుండు క్షేమమొందె!
నీసేవలొనరించి నెలతయౌ రుక్మిణీ
శ్రీకృష్ణదేవుని చెలిమిపొందె!

నిన్ను నమ్ముకొనుచు నీ ప్రియతనయుడై
శ్రీ గణపతి గొప్ప సిద్ధిబడసె !
నీకు వినుతిచేసి లోకోపకారియై
శ్రీ షణ్ముఖుండు ప్రసిద్ధుడాయె !

గీ॥ నిన్ను నమ్మనివారికి వెన్నుడైన
ముక్తి కలిగింపజాలడు ముదముతోడ
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 15

సీ॥ నిన్ను స్మరింపక నిన్నవమానము
పాల్జేయ దలచిన పాపియై; జ
లంధర దైత్యపాలకుడు పొందెను కడు
నీచ మరణము త్రినేత్రువలన!
సప్తలోక పతులు తప్పమె పోదురు
తల్లిరో నీదయ తక్కువైన!
సర్వజీవులు నిన్ను జననీ యటంచును
పిలుచుచున్నారు ప్రవిమలగతిని!

గీ॥ నాదు పాపాలపుట్టను నాశనంబు
చేసి కరుణింపవే యంబ! శ్రీఘ్రమిపుడె
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల !
ఘనవినుత! శ్రీవిజయవాడ కనకదుర్గ! 16

సీ॥ సంగీత సాహిత్య సరస శృంగారముల్
వెలసె నీ భువిని నీ చలువవలన!
యీ గడ్డపై పుట్టెనెందఱో కవిచక్ర
వర్తులు; ధీయుతుల్ పరమభక్త
బృందముల్ మాన్యులు; సుందర వదనార
విందలు; సాహిత్య వేత్తలెల్ల!
వీరకిశోరముల్; ధీరహృదయులైన
దేశరక్షాదక్ష దీక్షపరులు;

గీ॥ ఇట్టి "విజయవాడ భువిని హితమటంచు"
కూర్మితో వచ్చితివ! వెండికొండనుండి
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీవిజయవాడ కనకదుర్గ! 17

సీ॥ ఒకప్రక్క త్రిపురారి సుకుమారుడై యుండ
మఱియొకచో శుంభ మర్దనంబు!
ఒకప్రక్క గౌరీశు డోంకారము జపింప
మఱియొకచో శంభ మర్దనంబు!
ఒకప్రక్క లింగేశు డోహో యనుచునుండ
మఱియపుడు మహిష మర్దనంబు!
ఒకకంటితో నీవు సకలరాక్షసులను
కాల్చివేసిన మహాంకాళివమ్మ!

గీ॥ ఇంకొక నయనంబున నీవు శంకరునకు
ప్రేమ గుఱిపించితివి చాల ప్రీతితోడ!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 18

సీ॥ మంచి మనసుకంటె మించిన కులమేది?
మంచిమాటలకన్న మధురమేది?
మానవత్వము మించు మతమేది; చర్చింప?
దానవత్వముకంటె హీనమేది?
దానగుణముకంటె దైవతత్త్వంబేది?
సత్యమాడుటకంటె శౌచమేది?
గానామృతముకంటె కైవల్య సుఖమేది?
ధర్మంబుకంటె సత్కర్మ మేది?

గీ॥ మానరక్షణకంటెను మాన్యమేది?
స్వార్థభావముకంటె దౌర్జన్యమేది?
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 19

సీ॥ నిన్నెవరేనియున్ నిశ్చల మతితోడ
పూజింప తాము ప్రపుణ్యులౌను!
నిన్నెప్పుడైనను నిర్మల నిష్ఠతో
భజియింప తాము సౌభాగ్యులౌను!

నిన్ను నిత్యంబు సునీతి చిత్తముతోడ
ప్రార్థించువారి ప్రారబ్ధమణగు;
నిన్నె దైవమనుచు నెఱనమ్మి చరియించు
వారికి కలుగు కైవల్యపదవి;

గీ॥ నిన్ను నమ్మిచెడినవారు నేడులేరు
నిన్ను నమ్మకున్న చెడుట నిజముసుమ్మి!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 20

సీ॥ లక్క మేడలతోడ లావణ్యమలరార
విజయవాడ వెలసె పృథ్వియందు;
నిక్కము కృష్ణవేణీ నదీశోభతో
విజయవాడ వెలసె ధ్వజమువలెను;
చక్కని జనులతో సమవాదమును నిల్ప
విజయవాడ వెలసె విశ్వమందు;
మక్కువగూర్చెడు మాన్య చరితులతో
విజయవాడ నిలచె విమలమొప్ప

గీ॥ ఒక్కడును లేడు మచ్చుకు టక్కరుండు
యిక్కడున్నంత హాయి లేదెక్కడైన!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 21

సీ॥ కమనీయమైన నీ కాంతిరేఖల నెంచి
కైలాసనాథుండు కదిలివచ్చె!
రమణీయమైన నీ లక్ష్యమున్ పరికించి
భూతనాథుడు పొందె ప్రీతిసుమ్మి!
విమలవంతమగు నీవేషమున్ దర్శించి
శంభుండు మదిలోన సంతసించె
రమవంటి నీరూపు ప్రణయము గల్గింప
పరమేశ్వరునకు సంబరము కలిగె

గీ॥ జాలిగల్గిన నీవంటి జనని లేదు!
నిన్ను ప్రార్థించుటే నాకు నియమ మమ్మ!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 22

సీ॥ మంచితనంబున్న మతమేల? మహినింక
కోమలత్వంబున్న కులము లేల?
కరుణా రసంబున్న కైవల్యపదవేల?
సభ్యతకల్గిన జపము లేల?
శీలంబుకల్గిన స్త్రీలకు వ్రతమేల ?
ధైర్యంబు కల్గిన ధనము లేల?
సంసారమున్నచో సౌజన్యమింకేల?
సత్సంగ మున్నచో సౌఖ్యమేల

గీ॥ శాస్త్రము లెఱిగియున్నచో చర్చలేల?
శాంతగుణమలమడిన వేదాంతమేల?
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 23

సీ॥ ధనము పెరుగుచుండు ధనమున్నచోటనే
పుణ్య మెదుగుచుండు మునులచెంత
పాపము చేరును పాపము చెంతనే
కోపము హెచ్చును కోపిచెంత!
కామువృద్ధియౌ కామినీ చెంతను
సీమము పొసగు సునీతుపొంత!
రోషము కలుగును దోషులచెంతను
జడములు తొలగు విజ్ఞానిచెంత!

గీ॥ దుష్టగుణములు తరుగు సాధువులచెంత
సర్వమానవుల్ సుఖియించు "సమత" చెంత
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 24

సీ: పేదలన్ బాధించి పెచ్చువడ్డీలను
పిండుకొని ధనము పెంచువారు;
జీవుల హింసించి; చిచ్చుగావించుచున్
పృథ్వియందున బ్రతు కీడ్చువారు;

కొంగ జపముచేసి; దొంగతనము తోడ
వంచకులగుచు జీవించువారు
దేవుని పేర్జెప్పి దేశదేశములందు
ధనము సంపాదించి దాచువారు

గీ॥ చెప్పి చేయకుండగ తప్పు చేయువారు
శీఘ్రముగ నరకపథము చేరుగాదె!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! **25**

సీ॥ మోసము గెల్చును మూడురోజులపాటు
తదుపరి చచ్చును తప్పకుండ:
డంబముగెల్చును; డంబము నిల్చును
మూడు రోజులపాటు ముక్తసరిగ;
న్యాయము నిలచును న్యాయము గెలుచును
యుర్విలో దినకరుడుండువరకు
ధర్మము నిలచును ధర్మము గెలుచును
సృష్టిలో శశి ప్రకాశించువరకు;

గీ॥ నీదు భక్తులమేయులై నిలచునెపుడు!
నీదు భక్తకోటికి రావు నిందలెపుడు!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! **26**

సీ॥ "ఆర్యులు ద్రావిడు" లనియెడు విషబీజ
ములను సృష్టించుట మూర్ఖమదియె!
కుటిలమ్మై బరగిన కులవాదముల భువిన్
జటిలము చేయ! యజ్ఞాన మదియె
మత్తుమందులవంటి మత విధానములతో
జీవుల నమ్మింప ఛిద్రమదియె!
వర్గ కలహములు ప్రజలలో కలిగించి
వారిని కడతేర్చ ఘోరమదియె!

గీ॥ నీతి నియమాలు లేనట్టి ఘాతకులకు
జాలొకింతయు లేదాయె! జనని వినుమ!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 27

సీ॥ తమ మెప్పుదును మతి స్థిమితము నొసగదు
దారి చూపించు నిదానమొకటె!
శమము కల్గినవాడు శత్రుని కంటెను
బలవంతుడై యుండు భద్రగతిని!
అధికారాశయున్నచో హరిహరాదులుకూడ
గెలువబోజాలరు తులువనైన!
మోహభావములున్న ముక్తి బడయలేరు
మునులైన గురులైన మొదలు తెలియ!

గీ॥ శాంత మొనగూర్చు సరళియే సౌఖ్యమొసగు!
హంత మొనరించును దురాశ! వంతలొసగి
భవ్యగుణజాల! శివలోల భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 28

సీ॥ సకల జీవులలోన శర్వాణి నీయంశ
జీవాత్మయై ప్రకాశించుచుండె
పంచభూతములందు భాసురంబుగనుండు
కాంతియు భవదీయ కళలు తల్లి!
సూర్య కిరణముల సొంపులో నీదివ్య
తెల్లని కాంతియే తేజమాయె!
గలగలమని పాఱు గంగలో నీశక్తి
జీవశక్తిగ విరాజిల్లుచుండె

గీ॥ గాలిలో నీవు! భూమిపై గగనమందు
నీవు! నీవు లేనట్టిదా తావుగలదె?
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 29

సీ॥ మతముల చాటున మాంద్యులు మనుజులన్
వంచించబూనుట భావ్యమగునె!
కులములపేర ప్రజలను వేరుబరచ:
యింపైన "సమత" సాధింపబడునె?

మతము కులము లెల్ల మానవలోకాన
　　వృత్తి ధర్మముచేత వృద్ధిపొందె!
భగవంతుడైనట్టి పరమాత్మకు; కులము
　　మతముల గొడవ సమ్మతముకాదు!

గీ॥ విశ్వమందున నరులు వివేకమెరిగి
వర్తనముసల్ప సోదర భావమలరు-
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 30

సీ॥ ఏనీ చరిత్రలు వీనులన్ సోకగ
　　ప్రారబ్ధ కర్మముల్ పారిపోవు!
ఏనీ పునీత విధాన మెరిగినంత
　　జగతిలో జనులకు జడము తొలగు!
ఏనీ విమలరూప మీప్సితంబునచూడ
　　కలుష ఘోరాటవి కాలిపోవు!
ఏనీ జపము దివ్యహితకరంబని యెంచి
　　మసలి యుండిన గొప్ప మహిమలలరు!

గీ॥ అట్టి నీ పాదపద్మముల్ పట్టుకొంటి!
యితర గాథలతోడ నాకేల! చెపుమ
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 31

సీ॥ దీన నరులను నిందింపకున్నను చాలు
దివ్య ధర్మములెల్ల తెలిసినట్లె!
విద్వాంసులకు పేరు పెట్టకున్నను చాలు
సన్మాన సభలెల్ల జరిపినట్లె!
పేదవారిని కష్టపెట్టకున్నను చాలు
సకలదానములెల్ల సలిపినట్లె!
భక్తుల నవమానపరచకున్నను చాలు
మేలైన బుద్ధితో మెలగినట్లె!

గీ॥ ఒకరికపకార మొనరింపకున్న చాలు
మహిత కీర్తులగాంచుచున్ మసలినట్లె!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ

సీ॥ దోషమెరుగని జంతువులనెల్ల వధించి
భుజియించు వారికి భజనలేల?
కసుగాయతుల్యులా పసిపాపలను జంపి
చరియించు జడులకు జపములేల!
ఆడబిడ్డలసొమ్ము లపహరించెడు; దుష్ట
దానవ మతులకు తపములేల?
స్త్రీల బ్రతుకులను చిచ్చుగావించుచున్
మసలు వారికి గురు మంత్రమేల?

గీ॥ పుణ్యహీనులౌ ఖలులకు పూజలేల?
తంత్ర గొట్టులకు పరమ తత్త్వమేల?
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 33

సీ॥ మాలిన్యహృదయుండు మాటవరుసకైన
నెరుగడు నీలీల లిందువదన!
మందభాగ్యుండు నీ మహిత ప్రతాపమున్
చూడజాలగలేడు సుంతయైన!
మగువలన్ హింసించి మనుగడ సాగించు
కుటిలాత్ము లిక నిన్ను గొలువలేరు!
మగలను నిరసించి మసలేటి వనితలు
నీమాట పలుకరు నిరతమెపుడు!

గీ॥ ముక్తి పథమున్ తెలియని విమూఢమతులు
నిన్ను భజియింపరారు ప్రసన్నమొప్ప!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 34

సీ॥ నాస్తిక మతులకు నాక లోకంబేల?
హేతువాదులకు పునీతమేల?
లంచగొండులకెల్ల మంచి తనంబేల?
హీనుల కాత్మాభిమానమేల?

వ్యసనలంపటులకు వావివరుస లేల?
దేశ దిమ్మరులకు దీక్ష లేల?
చెనటిమానసులకు చిద్విలాసం బేల?
నాతతాయులకు మర్యాద లేల?

గీ॥ వదరు బోతులకు భువిని వ్రతము లేల?
మంచి మాటలు జగడాలమారి కేల?
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 35

సీ॥ చీమిడి ముక్కుతో చింపిరి జుట్టుతో
మాసిన బట్టతో మసలుచున్న
తనయుని పొడగాంచి యనురాగ మొప్పార
చేరదీయును మాత శీఘ్రగతిని!
ఇట్టి రీతిగ నీవు సృష్టికెల్లను తల్లి
గా విలసిల్లెడు కారణమున
నీదు బిడ్డడనైన నాదు తప్పులగాచి
ముక్తి నొసంగుటే మురిపమాను!

గీ॥ "నిఖిలలోక సంరక్షణ" నీది కనుక
వేడనిక పరులను; చతుర్వేద విదిత!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 36

సీ॥ ఇంటి యిల్లాలినీ చంటిపిల్లలనెల్ల
పస్తులు చేయించి పరువు వీడి
లక్షలపై లక్షలను గడించుచు; పెట్టె
లందున దాచ పసందులలర;
దొంగయొకడో లేక దొరయొకండో వచ్చి
గుంజుకు పోదురీ గుట్టులెరిగి
యిట్టి పిసినిగొట్టు లిహాపరములు రోసి
జీవించుగద! బండశిలల భంగి

గీ॥ పిసినిగొట్టుల కంటె పాపిష్టినరులు
ధరణిలోలేరు! లేరాయె! పరమజనని
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీవిజయవాడ కనకదుర్గ! 37

సీ॥ అలనాడు సంతాన మధికంబు బడసిన
మగువకు దక్కెను మంచి కీర్తి
యీనాడు పిల్లల నెక్కువ కనియున్న
చేడియ గాంచును చెడ్డపేరు
ఆనాడు మరి; భ్రూణ హత్యయే; పంచ పా
తకములందు ప్రథమ స్థానమంద;
యీనా డదియె; కడు మానవీయత జెంది
తప్పుగాకుండంగ తనరుచుండె!

గీ॥ కాలగమనాన మార్పులు కలుగుటనగ
నరుల మేలుకటంచునే నమ్మవలయు!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 38

సీ॥ దానముల్ లేకుండ ధనముదాచిన తప్పు
చాదస్తుడై యుండ చాలతప్పు!
జీతముల్ పొంది పైమేత కోరినతప్పు
పేదలన్ పీడింప పెద్ద తప్పు!
పన్నులనెగవేసి ప్రబలియుండుట తప్పు
వ్యసనులై తిరుగుటే యసలు తప్పు!
సంసారమున్ విడచి సన్యసించుట తప్పు
స్త్రీలను చెరపుటే సిసలు తప్పు!

గీ॥ పొదుపు పాటించకుండుటే మొదటి తప్పు!
పనులొనర్చక తినుటయే ప్రథమ తప్పు!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 39

సీ॥ ఆగిపోయిన గడియారమైనను చూడ
ఖండితంబుగ తాను రెండుసార్లు;
సరియైన సమయంబు చక్కగా చూపించు;
కాని నరుడొనర్చు కార్యమందు

మంచేమిటో మఱి వంచనం బేమిటో
యెంచసాధ్యంబె! ప్రపంచమందు
యిచ్ఛవచ్చిన రీతి యెల్ల జనావళి
మసలుచుండిరి నేడు మంచిమఱచి

గీ॥ ఇంక మావంటి కవులకు పంకజాక్షి
దారి లేదాయె! భువిని గోదారితప్ప
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 40

సీ॥ పలుమార్లు నీపాట పాడుచుండెడు వాడు
పాడుపాటలు నోట పాడబోడు
పలుసార్లు నీమాట పలుకుచుండెడివాడు
పాడు మాటలు నోటపలుకబోడు
పావనంబుగ నీదు భజన సల్పెడువాడు
పలుగాకి జనులతో కలుకబోడు
పదిలంబుగా నిన్ను ప్రస్తుతించెడువాడు
పరభామలనుకూడి తిరుగబోడు

గీ॥ "పరమ పదవి"ని కోరు నీ భక్తవరుడు
వ్యసనపరులను గుమిగూడి మసలబోడు!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 41

సీ॥ నిర్మలంబౌ కృష్ణ నీరముల్ గొనితెచ్చి
చల్లగా నీపైన జల్లవలెను;
మధురాతి మధురమౌ మంచి పండ్లను తెచ్చి
యింపుగా నైవేద్య మిడువవలెను;
కోమలంబైనట్టి కుసుమాలు గొనివచ్చి
దీక్షతో నిన్ను స్తుతింపవలెను;
పరిశుద్ధ హృదయాన పరవశంబును చెంది
నిన్ను భావించుటే నేర్వవలెను;

గీ॥ అంత టంతరంగమునందు వంత లుడిగి
చిత్కళలు పొడసూపు ప్రసిద్ధ మొప్ప
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 42

సీ॥ వాసిగా నీకథల్ ప్రస్తుతించెడువాడు
చెత్త కథల చర్చచేయబోడు;
విమలమౌ నీ గాథ వినుచునుండెడువాడు
చెనటి నరుల గాథ వినగబోడు;
దివ్యమౌ నీశక్తి దీక్షతో కనువాడు
పరుల శక్తినిగూర్చి పలుకబోడు;
పుణ్యమౌ నీపేరు పొగడుచుండెడువాడు
చెడ్డమాటలు నోట చెప్పబోడు;

గీ॥ అంచితంబుగ నిన్ను పూజించువాడు
మత్తులైనట్టి నరులతో మసలబోడు
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 43

సీ॥ వేషమొకటివేసి భాషింకొకటినేర్చి
మాటలాడిన తాను మహితుడౌనె?
సరసమెల్లను వీడి పరుషముగ చరించి
మాటలాడగ తాను మాన్యుడౌనె?
మంచి మనసులేక మతవాదియై తాను
మసలియుండినవాడు మనుజుడౌనె?
కులవిభేదముచూపి ఖిల విధానము నిల్పి
మనెడు నరుడు చూడ మనిషియౌనె?

గీ॥ మమత సమతలు మఱచిన మనుజజాతి
మానవత్వంబునకు దెచ్చుమచ్చ తల్లి
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 44

సీ॥ చేతినిండుగ సిరుల్ చెలగుచుండిననాడె
పడతి ప్రేమనుజూపి పలుకుచుండు;
నిలకడగా పేరు నిలచియుండిననాడె
చుట్టాలు మన్నన చూపుచుండు;

కలిమితో పదవులు కలిగియుండిన నాడె
స్నేహితుల్ లెస్సగా చేరుచుండు;
శ్రేష్ఠమా దానాలు చేయుచుండిన నాడె
భువిలోన జనులెల్ల పొగడుచుండు;

గీ॥ ఏమియున్నను లేకున్న నించుకైన
నీకరుణ మారునే తల్లి! లోకమాత!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 45

సీ॥ పాపాటు గ్రహపాటు సర్వజీవులకుండె
మానవుం డింకెందు మాన్యుడౌను?
సరసంబు విరసంబు సకల జీవులకుండె
మానవుం డింకెందు మాన్యుడౌను?
భయమెల్ల శమమెల్ల వసుధ జీవులకుండె
మానవుం డింకెందు మహితుడాయె?
నిద్రయున్ విశ్రాంతి నిఖిలజీవుల కుండె
మానవుం డింకెందు మహితుడాయె?

గీ॥ ఇంపుగా నినుగూర్చి చింతింపనట్టి
జనుడు రెండుకాళ్ళ విచిత్ర జంతువమ్మ!
భవ్యగుణజాల! శివలోల భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 46

సీ॥ ఉద్యోగి తాను నిరుద్యోగి బాధల
నించుకేనియును గ్రహించ డకట!
కలిమిగల నరుండు కలిమిహీనుల గూర్చి
యించుకేనియు విచారించ డకట!
వరకట్నములుకోరు నరపశువులు తాము
మంచిచెడ్డలను యోచించ రకట!
వడ్డీల గుంజేటి పాపాత్ములెల్లరు
దీనులన్ గూర్చి చింతించ రకట!

గీ॥ వినయ మెఱుగని కపటంపు మనుజజాతి
దివ్యముగ నినుజేరి ప్రార్థించ రకట!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 47

సీ॥ మలిన భూయిష్టమై మంజుల రహితమై
మానవ దేహంబు మహిని వెలసె!
మందుమాకులతోడ మాయరోగాలతో
మనుజ శరీరంబు మలచబడెను
మత్తుమందుల కైపు మత్సరంబుల వైపు
మనుజ కాయంబులు మసలుచుండె
మంచి విందులతోడ మగువ పొందును కూడి
మర్త్య దేహంబులు మనుచునుండె!

గీ॥ ఇట్టి దేహంబు మట్టిలో హీనగతిని
కడకు; కలియునటంచు నేకానసైతి
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీవిజయవాడ కనకదుర్గ! 48

సీ॥ ఖలమతినై చాలకాలంబు గడిపితి!
నిను విస్మరించుచున్ నిజము, నిజము,
ధర్మహీనుండనై ధారుణీ వలయాన
తులువ నరులతోడ మెలగియుంటి!
"పావనవతియైన దేవి దుర్గాంబను
సేవింపని జనులు చెవటు" లనుచు
భూసురులెల్ల పూని ప్రబోధింప
నామదిని కలిగ నమ్మకంబు!

గీ॥ కంఠమందున ప్రాణముల్ కదులు వరకు
నిన్ను కొనియాడి జీవింతు నిశ్చయముగ
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 49

సీ॥ తెలిసియో, తెలియకో పలుపాపములు సల్పి
అనుభవించుచునుంటి ననుదినంబు;
ఇలలోన నావంటి తులువ లేడంచును
తెలుసుకొంటిని తేటతెల్ల ముప్ప!

శిలవంటి యెదలందు సిద్ధి కల్గించేటి
జనని నీవంచును వినుట జరిగ
కలనైన నీ రూపు కండ్లబడునటంచు
నమ్మియుంటిని నాదు నెమ్మనమున!

గీ|| అనునయంబుగ నన్నేలు యమ్మవీవె!
తప్పు లెల్లను మన్నించు తల్లి వీవె!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 50

సీ|| పరనారి పొందుకై పరితపించెడువాడు
పదిలంబుగా పొందు ప్రాణహాని!
పరుల విత్తముకోరి పరితపించెడువాడు
మానకుండగ పొందు మానహాని!
పరుల యశంబును పాడుచేసెడువాడు
పదిమందిలో నగుబాటుపొందు!
పరుల కశుభమును పరికించు మనుజుండు
నిరతంబు బడయును నిందలెల్ల!

గీ|| తమకు తెలిసిన జ్ఞానమే విమల మనుచు
నెంచి చరియించువారు నశించుగాదె!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 51

సీ॥ కర్మేంద్రియంబుల కట్టడి నరికట్టి
జ్ఞానేంద్రియములపై జయముగాంచి;
మహిమ గల్గిన నిన్ను మదిలోన ప్రార్థించి
మనసుగతిని బట్టి మార్చివేసి
పిదప బుద్ధినిపొంది ప్రీతితో దానికి
చిత్తంబు జతచేయ శీఘ్రగతిని
తదుపరాహంకార మది తటాలున త్రెగి
"జీవాత్మ" వికసించు పావనముగ

తే॥ అంత యాత్మతేజముగల్గు సంతసమున!
నీదుకృపయున్నచో ముక్తి నాదికాదె!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 52

సీ॥ చేతులు కోరును చెడ్డపనులు జేయ
పాదముల్ వాంఛించు పడతిగృహము!
గుహ్యేంద్రియమ్ములు గుట్టుగా తలపోయు
వెలయాలి పొందుకై వివిధ గతుల!
వాక్కు భావించును ప్రజలను దూషింప
కండ్లు కోరును పరకాంత సొగసు;
జిహ్వ తలంచును చెడ్డ మాటలు పల్క
చిత్త మడుగుచుండు మత్తుకోరకు

గీ॥ నిట్టిగతి నింద్రియంబులు పట్టి పట్టి
పాడొనర్చుచుండెను గద! పాప మనక!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 53

సీ॥ కృతయుగంబందున; కీడు కోరక మంచి
యజ్ఞముల్ చేయుట యశముసుమ్మి!
త్రేతాయుగమునందు త్రిగుణముల జయించి
జపము దపము సల్ప సార్థకంబు!
ద్వాపర మందున పావన మదితోడ
పూజలొనర్చుట పుణ్యమాయె
నేటి కాలమునందు నీ నామ చింతన
కైవల్య మిప్పించు ఖచ్చితముగ!

గీ॥ గట్టి నమ్మక మున్నచో కలదు ముక్తి!
నీదు దయకల్గినను చాలు మోద మదియె
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీవిజయవాడ కనకదుర్గ!

సీ॥ కాత్యాయినీ తల్లి! కాదంబరీ గౌరి!
శాకంబరీ! యంబ! సత్యచరిత!
కాశీవిశాలాక్షి! కైవల్యసిద్ధిణీ!
రాజరాజేశ్వరీ! రమ్య! భరిత.

దనుజ వినాశినీ! దైవస్వరూపిణీ
ధర్మ వికాసినీ! కర్మరహిత!
లోకేశ్వరీ! యుమా! శోకనివారిణీ
పాప విధ్వంసినీ! పరమ విహిత!

గీ॥ కోటిసూర్య ప్రకాశినీ కోమలాంగి
నిఖిలజీవ సంరక్షణీ! నిర్మలాంగి!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 55

సీ॥ ఒక్కతల్లికిపుట్టు నిక్కంబు నల్వురు
సుతులో, లేక సుతలో! సుందరాంగి!
వారిలో నొక్కండు భాగ్యవంతుడయిన;
వేఱొక్క రరయగ బీదయౌను!
పూర్వజన్మమునందు పూనిచేసిన కర్మ
వదలిపెట్టక వచ్చి పట్టుదలను
ప్రారబ్ధ కర్మయై పలుబాధల నొసంగి
ప్రబలియుండును తాను పలువిధములు

గీ॥ ఉన్నవాడెప్పుడును తన కున్నదాని
లోన దానముల్ చేయుటే లోకహితము
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 56

సీ॥ పార్వతీ. లోకపావనవతీ! పరమేశ్వ
రీ! భ్రమరాంబికా! రిపువినాశి!
సర్వశుభకరీ! ప్రశాంత స్వరూపిణీ!
జగదాంబికా! సాధుజన వికాసి!
ఓంకార రూపిణీ! యుజ్జ్వల బలవతీ
భువనైక సుందరీ! పుణ్యనామ!
సౌభాగ్య దాయినీ! శర్వాణి! ధీమణీ!
ముల్లోక ప్రభ్వీణీ! ముక్తిధామ!

గీ॥ సకల మునిజనవందిత! సౌమ్యచరిత!
నిఖిల కవిబృంద పాలిత! నిగమ విదిత!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 57

సీ॥ క్రూరమృగములతో వీరత్వమున పోరి
బహుళ యశంబును బడయవచ్చు;
అరివీరులనుబట్టి యవలీలగా మట్టి
పలురాజ్యములను చేపట్టవచ్చు;
శతమూర్ఖులను పిల్చి సౌమ్యత కలిగించి
భూరి కీర్తులనెల్ల పొందవచ్చు;
బీదసాదలగూడి ప్రీతితో మాట్లాడి
మేలైన రీతితో మెలగవచ్చు;

గీ॥ కాని మనసు గతినిబట్టి కట్టివేసి
నీదు పాదాలచెంతను నిలుప తరమె?
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 58

సీ॥ సాగరంబునగల జలచరంబుల గూర్చి
ఖచ్చితంబుగ లెక్కకట్టవచ్చు;
నీరు లేనట్టి యెడారులందునగల
యిసుక రేణువుల లెక్కించవచ్చు;
వనము లందునగల పక్షుల లెక్కను
తప్పు లేకుండంగ చెప్పవచ్చు;
గగనాన విహరించు గ్రహరాశి చర్యలన్
నిపుణ మొప్పార గుణించవచ్చు;

గీ॥ కానినీ దివ్య తత్త్వంబు ఖచ్చితముగ
నెంచ సాధ్యమె? కడ కావిరించికైన.
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ!

సీ॥ ముఱికినీళ్లును తొలకరి వాననీళ్లును
చిక్కని నీరును; మిక్కిలైన
వేడినీరును, తొండి వెన్నెల గాలియు
తగలని సలిలంబు త్రాగ తగదు;

యతి శీతలంబైన; నతి చప్పనైనను,
యుప్పధికమయిన యుదకములను
నాచునీళ్ళను; గడ్డినానిక నీళ్లను;
వర్జించవలయును వైనమెఱిగి;

గీ॥ శీతలంబైన గంగను ప్రీతితోడ
త్రాగుచుండిన రోగముల్ తప్పకొసును
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 60

సీ॥ తృప్తిలేని నరుండు సప్తలోకములందు
సంతోష మొందదు! సవ్యగతిని!
లోభివారినిచేరి రోదనంబొనరించ
ఫలమేమి? తుదకున్న ఫణముపోవు;
నీతిమార్గము వీడి నిగమముల మఱచి
చరియించు మనుజుండు జడుడుసుమ్మి!
జీవితంబున తాను సిగ్గు లజ్జలుమాని
కులుకుచుండిన గాంచు కుటిలతనము!

గీ॥ ముందుగతుల నెఱుగుచు పసందు లలర
నడచు ప్రాజ్ఞుల నిడుములు విడిచిపెట్టు
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ!

సీ॥ కరుణార్ద్ర హృదయుండు కమలసంభవునిచే
వందనంబులు పొందు వైభవముగ!
దేశరక్షణకోరి దీక్షతో చనుదేర
స్వర్గాధిపతి పల్కు స్వాగతంబు!
త్యాగమత్తులు తాము యమధర్మరాజుచే
యంజలి బడతురు రంజితముగ!
"మానవత్వము మీద మమత సమత కల్గి"
మసలిన; హరియే నమస్కరించు!

గీ॥ కనుక నెల్లవారికి శీలధనమె ధనము
శీల నిర్మాణమే జాతి మేలుకోరు!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 62

సీ॥ నిజముగా చింతింప నిలుపేద జనములు
కడుపార కబళంబు కానరాయె;
తలదాచు కొనుటకు తావైన లేదంచు
దిగులు పొందుచునుండె దినదినంబు;
రాకాసి వడ్డీకి రక్తమాంసము లిచ్చి
చిక్కి శల్యములాయె స్రుక్కిసుక్కి;
బడుగువారినిగాంచి వడిగ నీ వరుదెంచి
కరుణించి బ్రోవవే కల్పవల్లి;

మానవత్వముపై మంచి మమతకల్గి
మసలు తల్లివి నీవెపో! మహిని సుమ్మి!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 63

సీ॥ పందిని నందిగా నందిని పందిగా
మార్చగలదు సుమ్మి మహిని ధనము;
మంచిని చెడుగాను, మఱి చెడున్ మంచిగా
మార్చగలదు సుమ్మి మహిని ధనము;
పావనమ్మును పాపపంకిలముగ బరి
మార్చగలదు సుమ్మి మహిని ధనము;
పతితభావములను పావన రీతిగన్
మార్చగలదు సుమ్మి మహిని ధనము;

గీ॥ దైవమైనను లోబడు ధనముజూచి;
"వసుధ ధనమహిమవలన బ్రతుకుచుండె"
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 64

సీ॥ భర్తకైనను తన భార్యకైనను చూడ
సిరిమూలముననె పేచీలువచ్చు;
తండ్రికైనను, తనయులకైనను
సిరిమూలముననె పేచీలువచ్చు;

మామలకైన జామాతలకైనను
సిరిమూలముననె పేచీలువచ్చు;
భక్తులకైనను భగవంతుకైనను
సిరిమూలముననె పేచీలువచ్చు;

గీ॥ వలదు దండి భాగ్యంబు లెవ్వారికైన!
మమత తొలగించు ఘనసిరుల్ మాకు వలదు
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ!

సీ॥ న్యాయమార్గమునందు నరజాతికి ధనమును
సముపార్జనము చేయ సవ్యమదియె;
నీచ దురాశకు నెలవు గాకుండక
ధనము సంపాదించి మనుట లెస్స!
పొందిన ధనములో పుణ్యకార్యములకు
కొంత వెచ్చించుచున్; సంతసంబు
బడయవలెనటంచు, పావనంబౌ వేద
శాస్త్రముల్ బోధించె సర్వమెఱిగి

గీ॥ దాన ధర్మముల్ ధన్యమౌ దయను కలిగి
నడచు మనుజుల జన్మముల్ నాణ్యమౌను!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 66

సీ॥ సంతతి లేనట్టి సతులు సంతానము
పొందిన వారి యానంద మెంతొ!
పదిసార్లును పరీక్ష పాడైనను తుదకు
విద్యార్థి పొందిన విజయమెంతొ!
లాటరీలో పదిలక్షలను వరించు
నిరుపేద సంతోష నిఖరమెంతొ!
యాశించకుండనే యధికశ్రేణి వరింప
యుద్యోగి పొందిన యుద్ధతెంతొ

గీ॥ అంతకంటెను పదిరెట్లు సంతసంబు
నిన్ను తలచిన కల్గును నిక్కముగను!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ 67

సీ॥ తనకు కలదటంచు తానే తినుట లోక
హితముకాదు; శ్రుతి సమ్మతముకాదు;
బీదసాదలకెల్ల మోదము కలిగించు
దానము లొనరించ ధర్మమగును;
విద్వాంసులను గాంచి వినయ మొప్పారగ
సన్మాన మొనరించి సాకవలయు
జడమును తొలగించు బడులను గుడులను
నేర్పించవలయును నేర్పులలర

గీ॥ అధిక జనములకు విరోధమైన పనులు
తలచి యుండుట తగదు విధాతకైన
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 68

సీ॥ శోకసమయమందు; ప్రసుక్తిన క్రోధ స
మయమందు సాపాటు మానవలెను;
పూర్వము తినినట్టి బోన మజీర్ణమై
యుండ; మరలతిండి దండగాను!
పథ్యమైనట్టి యపథ్యమైనట్టియు
తిండి కలిపి కల్పి తినుట తగదు;
సమయ సందర్భముల్ చర్చింప కుండగ
నాహారముగొనుట హాయిగాదు;

గీ॥ వేళ పాళలు పరికించి వివరమెంచి
భోజనంబు చేయవలెను పుడమి జనులు
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 69

సీ॥ భ్రాంతిలో మునుగుచు భ్రాంతిలో తేలుచు
నాత్మను మఱచిన యంధుడతడె!
కాంతలతో పొత్తు సంతోషమలయమని
వివర మెఱిగియున్న విమలుడతడె!

సత్సంగమేకద! సకలసాధనమని
భావించి మెలగిన ప్రాజ్ఞుడతడె!
అంతయును తనమేలని నమ్మి; కించిత్తు
ధైర్యముడుగకున్న ధన్యుడతడె!

గీ॥ సత్యమైనట్టి గురుమంత్ర సారమెరిగి
సంచరించుచు నుండ సౌజన్యుడతడె!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 70

సీ॥ మానినీ మనముల మర్మముల్ తెలియంగ
తరముగా దరయ విధాతకైన!
నొక కంటిలో నీరు; నొకకంటిలో పాలు
యీగుట్టు తెలుగుట యెవరితరము?
కంటిలో కన్నీరు కమనీయమైనట్టి
పయ్యెదలోనుండి పాలుగారు!
మనసొకప్పుడుచూడ మాన్యమై యలరారు
వేఱొకపు డదియె విషముచిందు!

గీ॥ నిర్మలత్వముతో తాను నిలిచియుండు
సహజ సహనశీల! లలన సాటి యెవరు?
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 71

సీ॥ శిష్యు హితముకోరి చెప్పుచుండెడు నిజ
గురువుల నెదిరించు గ్రుడ్డివాడు!
ఉపకారబుద్ధిని విపరీతముగ త్రోచి
మసలుచుండునుగాదె మడ్డివాడు!
శాస్త్ర సిద్ధాంతముల్ చాదస్త మనుచును
గెంటి వేయునుగాదె కుంటివాడు!
దానముల్ చేయక దండిగా ధనమును
దాచిపెట్టునుగాదె బూచివాడు!

గీ॥ మంచితనమును మఱచి కామించునరుడు;
వసుధలో వింత జంతువై మసలువాడు!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 72

సీ॥ చలిలో వణకుచు, నెండలలోన నెండియు
వానలో తడిసి మహానుభావు
త్రైవత్రి మ్రాన్రైతు లలసటను మఱచి,
నిండుగా కండలన్ పిండిపిండి
రాత్రింబవళ్ళు నిద్రయుమాని నిరతంబు
పంటల పెంపుకై పాటుపడును;
తపసుసల్పెడు నీమధనుల బోలెను జాతి
రక్షకులగుదురు రైతులనగ!

గీ॥ లాభనష్టములందు తలంపులేక
ప్రజలకై శ్రమించును కృషి పండితుండు
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 73

సీ॥ పరులకు నుపయోగపడని మానవజన్మ
వ్యర్థమైపోవు! యదార్థ మిదియె
పరహితమునుకోరు పావన మూర్తుల
జన్మకే జగతిలో సార్థకంబు!
పరులకు హితము సల్పకపోయినన్ కీడు
తలపెట్టిన నరుండు తులువసుమ్మి!
పరుల కపకృతులు భావ్యంబుగాదని
చేయకుండినవాడు ధీయుతుండు

గీ॥ సృష్టిలో నరజన్మము సేవకొఱకె
పుట్టెననుచు నమ్మినవారె పుణ్యులెందు
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 74

సీ॥ "ముడియినుమైన" నాత్మ; జడుని హృదయమందు
నలరియుండెనుసుమ్మి తలచిచూడ!
యినుమును కరిగించి యెంతయో శ్రమియించి
దబ్బులమూల్యంపు ధారణితుండు

ధనముబడయవచ్చు; తద్దయు కొంచెము
 శ్రమపెంచి సూదులన్ చక్కగాను
చేసి యమ్మిననాడు సిరులు పెరుగుగాదె?
 ముడియును మటులున్న మురిపమానె?

గీ॥ జ్ఞానమనెడు పరిశ్రమ జయమొసంగి
ప్రగతి నిలుపుచుండు నరయ పదిలగతిని!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 75

సీ॥ గురువుల బోధలు గురుభావములనుచు
 మర్మమెఱిగిన సత్కర్మసుమ్మి!
కాంతాకనకములు సంతోషలయమని
 కామంబు విడువ సత్కర్మసుమ్మి!
శత్రుమిత్రాదులన్ సమమైన రీతిని
 దయను పోషింప సత్కర్మసుమ్మి!
అపకారికైన తానుపకార మొనరింప
 ఖచ్చితంబుగను సత్కర్మసుమ్మి!

గీ॥ కలుగు దివ్యలోకములు సత్కర్మవలన!
కలుగు సకల పుణ్యములు సత్కర్మవలన!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 6

సీ॥ కర్మమంచిది చేసి ఖరకిరణుడు తాను
 గ్రహరాజుగా గొప్ప కాంతిపొందె!
కర్మమంచిది సల్పి కమనీయ చంద్రుండు
 భువిచుట్టు తిరిగెడు పుణ్యమందె!
కర్మచక్కగచేసి గగనాన చుక్కలు
 మెఱయుచుండెను తాము మిక్కుటముగ
కర్మచక్కగసల్పి గ్రహరాశి సర్వంబు
 వినువీథిలో తాము ఘనతలందె!

గీ॥ మంచి కర్మవలన జనుల్ మాన్యులౌను!
చెడ్డకర్మవలన తాము చెడుట నిజము!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 77

సీ॥ సంగీత సాహిత్య సంపదలకు మేటి
 నియమనిష్ఠలయందు నేతసుమ్మి
వేదాంతవీథిలో విహరించు ధీనిధి
 ముఖజితసోముండు పుణ్యమూర్తి
ప్రజలను నీతితో పాలించు రీతిలో
 భద్రగుణాత్ముండు భాసురుండు
రూపవయోబల లోపరహితుడు; ము
 మ్మూర్తుల సౌజన్య మూర్తియైన

గీ॥ నలుడు వీరాధివీరుండు నయచరితుడు
కడకు జూదమాడుటచేత కానకేగె!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 78

సీ॥ దిక్కునీవేయని నిక్కంబుగా నమ్ము
భక్తులపాలిట శక్తివీవు!
జన్మజన్మలనుండి జనియించె ప్రోగైన
సంచిత కర్మముల్ సమసిపోవు!
తరతరములనుండి దహియించు చున్నట్టి
పాపాగ్ని కీలల తాప మణగు;
కలడుగట్టినయట్టి కామరాకాసియు
కూలిపోవును సుమ్మి కుమిలికుమిలి!

గీ॥ నీ జగన్నుత నామము నీమమొప్ప
జపము చేయువారికి కల్గు జయముజయము!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 79

సీ॥ నీ పురాతనమౌ పునీతనామము చాలు
సకలరుగ్మతలెల్ల సమసిపోవ!
నీ దివ్యమైన సునీత చరిత చాలు
పాపజాలములెల్ల పాసిపోవ!

నీ సవ్యమైన వినిర్మలత్వము చాలు
తులువభావములెల్ల తొలగిపోవ!
నీ సవ్యమైనట్టి నేతృత్వమే చాలు
సంసారయాత్రలు సాగిపోవ!

గీ॥ నీ కరుణ కల్గిన విమల నాకలోక
మెంత? కైలాసమే వచ్చు సంతసమున
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 80

సీ॥ పరమ ధర్మములను పరికించి చర్చింప
స్త్రీపురుషులు తామ సృష్టియందు
సరిసమానమగును; పరిపరి విధముల
సతుల నేడ్పించిన శత్రుడైన
జయము పొందగలేదు; జాతి రత్నములైన
నయచరితలు స్త్రీలు భయముతోడ
వెనుకబడినవాడు విమలమైన ప్రగతి
ముందంజవేయక మూలపడును

గీ॥ సర్వజనులకు ధర్మముల్ సమముగాదె?
స్వార్థభావముచే జాతి సమయుగాదె!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ!

సీ॥ సీతనుగూర్చియే శ్రీరామచంద్రుండు
పరితపించెను కాని పరసతులను

చేపట్టియెఱుగడు పాపమని తలంచి
కనుక రామచరిత ఖ్యాతిబడసె!

నిట్టి దేవునిపేరు గట్టిగా స్మరియించు
జనులకు తమయందు స్వార్థమేల?

భర్తలేకున్నచో భార్యకు ప్రాణంబు
లేదంచు నుడువుట లెస్సకాదు!

గీ॥ భార్య లేకున్నచో భర్త ప్రాణముండు
నిజము తెలియ నెల్లరకును నీతియొకటె!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 82

సీ॥ గౌరినామజపము కైవల్య నిధియౌను
దుర్గనామజపము దోషహరము;

గిరిజనామజపము కీర్తి నిలయమౌను
అంబనామజపము లసువులొసగు;

కల్యాణినామంబు కాంతిదాయకమౌను
కాత్యాయనీయనన్ కాంతి పొసగు!

శాంభవీయనినచో సర్వశక్తులుగల్గు
పావనీ యన్నచో పాపమడగు

గీ॥ శివమనోహారిణీయన సిరులునిలచు
పార్వతీయనన్ కాలుడు పాఱిపోవు
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 83

సీ॥ పదిమందిలో స్త్రీలు బాగుగా తిరిగిన
నీతిగోల్పోవుట నిజముకాదు;
పదిమందిలో మగవారలు తిరిగిన
నీతిగోల్పోదురు నిష్ఠతొలగి;
సతులపై నిందలు సత్యంబుగాదాయె
సతులు సహనమందు సౌమ్యమతులు!
విద్యావినయములం దుద్యోగమందున
స్త్రీలు నేడు ప్రకాశించుచుండె

గీ॥ సుదతికి తెలివి తేటలు సొమ్ము సుమ్మి!
రాజ్యమేలు చుండిరిగాదె! రమణులిపుడు!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 84

సీ॥ ఉరగభూషణురాణి సిరులిచ్చు నిరతంబు
శివమనోహారిణి నాచింతదీర్చు;
గరళకంఠునిపత్ని కష్టముల్ తొలగించు
కైలాసపతి సతే కరుణజూపు!

గంగాధరునిసఖి గౌరవంబొసగును
విశ్వనాథునిభామ విద్యనేర్పు!
ముక్కంటి కులసతి ముక్తిమార్గము కూర్చు!
పరమేశ్వరునినాతి భవముమాపు;

గీ॥ మల్లికార్జునుదేవి నామంచినెఱిగి
కాచి రక్షించుగాత! సత్కరుణ తోడ!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ!

సీ॥ నిన్నుస్మరించిన నింగికిన్ నేలకు
కల్యాణమాగాదె! కరుణశీల!
నిన్ను జపించిన నిఖిల దిక్పాలకుల్
సంతసింతురుగాదె! సత్యశీల!
నిన్నుతలంచిన నిగమజలధియెల్ల
రత్నాకరముగాదె! రమ్యశీల!
నిన్ను పూజించిన నీమంబు దమమెల్ల
సిద్ధించుగాదె ప్రసిద్ధశీల!

గీ॥ యిన్నిమహిమలు కలిగిన కన్నతల్లి
నన్ను రక్షింపుమమ్మ ప్రసన్నశీల!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ!

సీ॥ బ్రతుకుబాటమలచి భయములనెడబాపి
కృతకృత్యుజేయవే కీర్తిశీల!
దండిగానాచేత దానధర్మములను
జేయించి బ్రోవవే స్థిరసుశీల!
యిహాపరములలోన సహానశక్తినొసగు
దీక్షకల్గింపవే దివ్యశీల!
ముక్తిధనమునిచ్చి మోదమెంతో జేసి
భవముబాపవె నాకు భవ్యశీల!

గీ॥ పూజగావింతు నెప్పుడున్ పుణ్యశీల!
నన్ను మఱువకు! తల్లిరో నయవిశీల!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 87

సీ॥ మతసామరస్యంబు మానవజాతికి
కామితంబొసగేటి కల్పతరువు;
మతసామరస్యంబు మానవీయులకెల్ల
పావనంబైన సంజీవిసుమ్మి!
మతసామరస్యంబు మతిమంతులకు మంచి
మమతలు కలిగించు విమలశక్తి!
మతసామరస్యంబు మహిలోన దివిలోన
సమతకూర్చేటి సౌజన్యశక్తి!

గీ॥ మతముపై యింకొకమతము మత్సరంబు
చూపుచుండిన జగతికి సుఖముసున్న
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 88

సీ॥ మద్దివానికి గొప్ప మనుగడ లభియింప
సజ్జనులనుబట్టి చావగొట్టు;
త్రాగుబోతును పిల్చి దయతోడ మాట్లాడ
పెక్కు తిట్లను తిట్టి నిక్కునతడు;
జూదగానికి కొంత చోటిచ్చినన్ చాలు
చిప్పచేతికి వచ్చు తప్పకుండ;
వ్యభిచారులను గాంచి యభివాదములు సల్ప
మానమర్యాదలు మంటగలియు;

గీ॥ చోరజనులతో నెయ్యంబు సుంతయున్న
నిప్పవలెను రాజిల్లును నిజము సుమ్మి
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 89

సీ॥ భూవర పదవియే పూనినను వరింప
వలను నాకదియే సర్పసదృశంబు;
యింద్రదపదవియైన హితముతో ననుజేరి
పిలచి వరించిన ప్రేమజూప;

బ్రహ్మపదవి తాను బ్రతిమాలుకొని వచ్చి
ముంగిట వాలినన్ ముట్టబోను;
త్రైలోక్య పదవియే తానుగా ననుపిల్చి
కోరియున్నను నేను జారబోను;

గీ॥ శాంత మాతవు నీదివ్య సముఖమందు
సేవకునిగ జేరుటే నాకు శ్రీకరంబు!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 90

సీ॥ కంచిలో కామాక్షి! కాశీ విశాలాక్షి!
మధుర మీనాక్షివై మహిని బ్రోచి;
శ్రీకాళహస్తిలో సిద్ధితో జ్ఞాన ప్ర
సూనాంబవై ముక్తి సుఖములిచ్చి;
శ్రీశైలమందున స్థిరమొప్ప భ్రమరాంబ
తల్లివై ప్రజకు వాత్సల్య మొసగి
దక్షవాటికలోన దక్షసుతవు సత్
దేవివై ప్రజ్ఞాన దివ్యయగుచు

గీ॥ విమల మహిమలు నెలకొల్పి వెలసియున్న
తల్లి వని నిను దలచనా; తమము తొలగ!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 91

సీ॥ "పీఠికాపురమందు పెంపుతో పురుహూత
శక్తివై భక్తులన్ సాకినావు;
రామలింగేశ్వరు రామవై నీమవై
పూజగొంటివి "గొల్లప్రోలు"లోన!
కొప్పేశ్వర సతివై కోనులరూపివై
భువిని బ్రోచితివి "పలివెల"యందు
"పొల్లూరు" నగరిలో చల్లని కరుణతో
పూజలందితివి ప్రపుణ్య మొప్ప!

గీ॥ ఇట నెటనుగన్న నీకాంతి యినుమడించె!
నీదుకీర్తి చంద్రికలెల్ల నిలచియుండె!
భవ్యగుణజాల! శివలోల భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 92

సీ॥ కాశికాపురిలోన కనికరమున; అన్న
పూర్ణవై వ్యాసుని బ్రోచినావు;
శ్రీకాళహస్తిలో చెలువొప్ప కన్నని
దీవించి ముక్తి యందించినావు;
కామాక్షివై భక్తగణములన్ ఖ్యాతితో
కాపాడితివి శివకంచిలోన!
మీనాక్షివై దుష్టదానవ వీరులన్
వధియించి యుంటివి మధురలోన!

గీ॥ కాళికాదేవివై కలకత్తలోన
వెలసియుంటివి తల్లివై విమల మలర!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 93

సీ॥ నీ దయవల్లనే నిజము "ఛత్రపతి శి
వాజీ" మహాత్ముడై వాసికెక్కి
పరదేశ ప్రభువుల ప్రాబల్యమును చీల్చి
చెండాడి వీరుడై చెలగినాడు;
నీ సవ్య కరుణచే నిర్మల చిత్తుండు
"కాళిదాసకవి" సాకల్యమొప్ప
సుకవిలోకమునందు సుస్థిరస్థానంబు
నిలబెట్టుకోగల్గె నిశ్చలముగ!

గీ॥ నీ జగన్నుత నామమే నిధులమూట
వేఱ ధనము లింకేటికి విశ్వమందు?
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 9

సీ॥ స్థిరముగానట్టి యీ దేహమున్ ప్రేమించి
దీనుల బ్రతుకులు దిబ్బచేసి
దండిగా వడ్డీలు దయమాలి రాబట్టి
పెద్ద పెట్టెలలోన పేర్చి పేర్చి

పుణ్యకార్యము రోసి భూస్థాపితము చేసి
దైవమును మఱచి దారుణముగ
జీవించువాడొక్క శిలతోడ సమమౌను
"వానికంటెను గొడ్డు పశువులెస్స"

గీ॥ ఇట్టి లోభుల సంపదల్ సృష్టియందు
దొంగలకు లేక దొరలకో తుదకు దక్కు
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 95

సీ॥ నిత్యంబు సత్యమున్ నీతితో పలుకుచు
వినయ విధేయులై మనెడువారు;
సర్వబాధల కోర్చి శాంతమున్ విడువక
ప్రజలమేలుకు పాటుపడెడువారు;
పరులు తననుజేరి పాడొనర్చగ పూన
భయము చెందక నిలబడెడువారు;
పది దినములనుండి పస్తులు పడుచున్నను;
అభిమాన మూర్తులై యలరువారు

గీ॥ భూమి కాపుకొఱకు తాముపుట్టి; మార్గ
దర్శకత్వము జేపట్టి ధన్యులౌరె!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 96

సీ॥ తనివితీరగ గంజి త్రాగగా నోచని
పేదజనులు పొందె; ఖేదనంబు;
గంజిలో వుప్పుకై గతిలేని బీదలు
లోకమందు సలిపె రోదనంబు
పాలలో కలపగ పంచదారయు లేక
మదియందు కుమిలె సామాన్యులెల్ల
మద్యమందు కలిపి మాంసపు ఖండముల్
తినుటకు లేవంచు తిండిపోతు

గీ॥ లేడ్చుచుండిరి వరునగా యేకగతిని
యిట్టి లోకాన నాజన్మమేల తల్లి!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 97

సీ॥ లేమినరుల గోడు లేశమేనియు కూడ
కలిమి వారలకేల, లలితవదన!
చంటిపాపల యేడ్పు సాంతాంశ మెఱుగుట
జాలిలేనట్టి గొడ్రాలికేల?
త్యాగమూర్తులయొక్క ధర్మ స్వభావముల్
భోగవంతులకేల భువనమందు?
జ్ఞానవరుల దివ్య మానవీయపు దృష్టి
మూర్ఖ మతులకేల మురిప మలర?

గీ॥ సరకు నాణ్యాలమాట తక్కరులకేల?
సానుభూతి చూప కసాయి వానికేల?
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత శ్రీ విజయవాడ కనకదుర్గ! 98

సీ॥ "శేషాద్రి శిఖరాన చెలువుగా నేనుండ
శ్రీనివాసుడు నన్ను జేరదీయు!
"రత్నగిరి"కిబోయి రక్షింపుమని వేడ
సత్యదేవుడునన్ను సాకగలడు!
"యాదగిరి"కి వెళ్ళి యా నరసింహుని
కొనియాడ తనయొక్క కొలువునొసగు!
"భద్రగిరి"కి జని పావన రాముని
పొగడుచుండిన మంచిభక్తినిచ్చు!

గీ॥ కాని యెందుబోవక నేను కన్నతల్లి
నిన్ను మాత్రమే సేవింతు నిశ్చయముగ
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 99

సీ॥ శ్రీశైలగిరికేగి శిరసువంచిన చాలు
మల్లికార్జునుడు సన్మాన మొసగు;
విమలకాశికిబోయి విశ్వేశ్వరుని వేడ
నన్నురక్షించు విన్నాణమొప్ప;

పీఠికాపురిజేరి ప్రీతితో పూజింప
కుక్కుటేశుడు మంచికూర్మినిల్పు
దక్షవాటికయందు దాస్యంబు సలిపిన
భీమేశ్వరుడు గొప్ప ప్రేమజూపు

గీ॥ కాని యెందుబోవక నేను కల్పవల్లి
నిన్ను సేవించి జీవింతు నిర్మలముగ
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 100

సీ॥ అన్నపూర్ణేశ్వరీ! యంబా మహేశ్వరీ
రాజరాజేశ్వరీ! రక్షవీవె!
శార్వాణి ధీమణీ! సజ్జన పోషణీ!
సత్యవ్రతాయిణీ! సర్వమీవె!
కాత్యాయినీ ఉమా! కారుణ్య హృదయిణీ
ముక్తి ప్రదాయిణీ! శక్తివీవె!
విజయభవానీ! వివిధ వేదవేదాంత
కారిణీ జగతికి కాంతివీవె!

గీ॥ గౌరి! శాకంబరీ మాత చారువదన
దివిజబృంద సంసేవిత! దివ్యసదన!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 101

సీ॥ ధరలోన తరగని ధనమున్న నరునకు
జీవితంబునుగూర్చి చింతలేదు!
పన్నుల నెగవేసి పసిడిమూటలు దాచి
జీవించువానికి చింతలేదు!
పెద్దవుద్యోగంబు పెక్కుకాలముచేసి
జీవించువానికి చింతలేదు!
పదియిండ్లు తిరుగుచు పారుపత్తెముపొంది
జీవించువానికి చింతలేదు

గీ॥ కాని; నగటు మానవునిగా కాలమంత
గడుపువానికి మాత్రంబు కలదుచింత!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 102

సీ॥ సర్వమతాలపై సమదృష్టిలేనట్టి
కుమతుల కెప్పుడున్ సమత రాదు!
కులజాడ్యములతోడ కులికేటి ఖలులకు
కోటిజన్మలకైన గౌరవము రాదు!
ధరను మానవులెల్ల తమవంటి వారంచు
భావించకున్నచో భక్తి రాదు!
నోటితో మాట్లాడి నొసటితో నిరసించు
మాయావులకు మంచిమనిసు రాదు!

గీ॥ హింసపాటించి జీవించు హీనజనుడు
మరల పొందగలేడింక మనుజజన్మ
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 103

సీ॥ కర్తవ్యదీక్షయున్ కరుణార్ద్ర దృష్టియున్
దృఢతరంబైనట్టి దేశభక్తి
కలిగియుండి క్రమశిక్షణతోడ; దేశీయు
లెల్లరు మానవ హితముగోరి
కులమతపరమైన కుటిలవాదములను
దిగనాడి జగతిలో సుగమమైన
సౌజన్యదృక్పథ సౌశీల్యభావముల్
కలిగి మసలునాడు వెలయు ప్రగతి!

గీ॥ యనుచుబోధింతును కవినై వినయ మలర!
నీతిచెప్పి చరించుటే నిర్మలంబు
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 104

సీ॥ ధరను "స్త్రీ బాహ్యసౌందర్యంబు" కంటెను
విస్తారమైనట్టి విషయముగలదె?
స్త్రీల విత్తంబును చేతబట్టుటకంటె
నాత్మఘాతక మింక నవనిగలదె?

నమ్మిదాచినవారి సొమ్ము మ్రింగుటకంటె
చండాలమైనట్టి చర్యకలదె;
పావనవతులను బలిమిపట్టుటకంటె
ఘోరనేరంబిక వేరెగలదె?

గీ॥ భక్త వరులను నిందించి బాధపెట్టి
మెలగు వానికంటెను నరమృగముకలదె?
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 105

సీ॥ మానవీయతకోరి మహిలోన దేశముల్
"పంచశీల"ను బలపరచుగాక
సామరస్యముపొంది సకలమౌ మతములు
పావన తత్త్వంబు బడయుగాక!
మేలైన శీలమున్ మెలతలెల్లనుకల్గి
చల్లగాతాము వర్థిల్లుగాక!
బీదలు ధనికులు భేదముల్ విడనాడి
మిత్రభావముతోడ మెలగుగాక!

గీ॥ పాడిపంటలు సకలసంపదలు పొంది
విశ్వమున మా"భరతమాత" వెలయుగాక!
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 106

సీ॥ వసుధలో; శ్రీదేవవరపు వంగడమున
వేంకటచలమను విమలగుణుడు
నాదుజనకుడు; వినయవతి శ్రీమతి
నాగరాజనుసాధ్వి నాకు జనని;
దోషరహితమైన "తూర్పుగోదావరి"
మండలంబందున మాన్యమైన
"గొల్లప్రో"లనియెడు పల్లెలో పుట్టి; శ్రీ
భద్రాద్రిరాముని భక్తితోడ

గీ॥ కొలిచి; కవిత వరించి నీ లలితకీర్తి
గూర్చి శతకంబు వ్రాసితిన్ కోర్కెతోడ
భవ్యగుణజాల! శివలోల! భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 107

సీ॥ మంగళము; మహేశ మందిరోన్నతవాసి;
విజ్ఞానరూపిణీ విమల, నీకు!
మంగళము; సకల మహనీయ సురబృంద
వందిత పాదారవింద, నీకు!
మంగళము; పతితమానవరక్షణా
దక్ష; సౌభాగ్యప్రదాయి, నీకు!
మంగళము; దివిజగంగా సమాధిక
పావన చరితాంగ! దేవినీకు

గీ॥ మంగళము రాఘవవినుత మహిత నీకు;
మంగళ మసుర మదభంగ మంగనీకు
భవ్యగుణజాల! శివలోల భక్తపాల!
ఘనవినుత! శ్రీ విజయవాడ కనకదుర్గ! 108

ఓం శాంతిః శాంతిః శాంతిః

